ముల ననుభవించుచు శివజూకు నుండినయది. అట్టినలకూబరుఁడా వార్త స్త్రీ ప్రలాపంబు విని తద్రక్షణకై వెళ్లి, కొంచెమునరాక, చాలకాలము మనలఁగాఁ దమిఁ బట్టలేక, తాపసము నోర్వక, యతని రోయుచు వచ్చి యతనిఁ గన్నులారఁ జూచుటయే కాదు, అతనియొద్దఁ దనప్రతిబింబ మనఁదగు నింకొక రంభను గన్నులుబుకునట్లు పొడగన్నది. నలకూబరుఁడును నీయిరువురంగని విభ్రాంతుఁడయ్యెను. అయ్యో! కలభాషిణికి వచ్చిన కష్టము! లేక లేక క్లేశపడి సంపాదించిన యర్థము క్షణభంగుర మయ్యెడు తెఱంగైన నాదైన్యము చెప్పఁ దీఱునా? ఇఁకపై నీయిద్దఱు సవతులకొట్లాట వర్ణింపఁబడియుండుతెఱఁగు వర్ణింప నాతరము గాదు! ఇది యద్భుతావహము! స్త్రీ ప్రకృతికి దర్పణము! ఎన్ని సామెతలు! తిట్లు! తలత్రిప్పులు! తుట్టతుదకుఁ గన్నీళ్లును! కడపట సత్యరంభ, తను “తథ్యమిథ్యా భావం బేర్పఱుప” “రా! దేవసభకుఁ బోవుదము” అని పిలచినది. పాపము! కలభాషిణికి నారదు వరమునఁ గామరూపము కలదే కాని, కానుగమనశక్తి లేదాయెం. కావున రంభచేతిలోఁ జిక్కఁగఁ జిక్కినదై చిన్నతనమురాకుండునట్లు, బింకములైనఁ బలికి, త్రోవఁ జూపికొందమను స్త్రీసహజమైన గరువతనంబు మెఱయ నేమనుచున్నది, చూడుఁడు:—

సీ. అప్సరస్త్రీలలో నగ్రగణ్యాత్వంబు
జగదుపశ్లోకితంబుగ వహించి
యూర్వశీ మేనకాద్యుత్తమస్త్రీలు రా
వమ్మ పోవమ్మ నా నతిశయిల్లి
యెన్నండు నెచ్చోట నెవ్వారిచే వ్రేలఁ
జూపించుకొనక ప్రస్తుతికి నెక్కి
నలకూబరుండు ధన్యతముండునా, గరు
వతనంబుచే నీకు వన్నెఁదెచ్చి

తే. మొప్పునే యింకఁ గడపట నిప్పిశాచి
నాకు సరిచేసికొని దేవలోకసభకు
నీవు నూ నీవు నమ్మాటి యేవిధమునఁ
గలహ మాడెద విది నీవె తలఁచిచూడు!

(ఆ. ౩. ప. ౨౩౨.)

క. ఈకలహ మపుడు వినఁబడు
నాకంబున సురల యూషము శేకతి నా
లోకింతుఁ జెల్వఁ దేగనీ
నాకు మగఁడు నిన్ను నిలుమనక రాకునికిన్

(ఆ. ౩. ప. ౨౩౩)

ఇప్పుడే కాదు. ఇదివఱకును "నీ యూన ధరణి విడిచి దివికి నడుగటుపెట్ట" ననుచున్నది. మనుష్యాంగన, తాఁజాలదు. ఈలోపముఁ గప్పిపుచ్చుటకై యేమియుక్తి! సరి; నలకూబరుఁడు సంశయాత్ముఁడై యామెను మెడవట్టి ప్రాయఁ ద్రోసెను. నిర్నిద్రమోహఫలమా యిది! సత్యరంభయు నాయమను "గత్తిచేతఁ గాయము గాయము" అని శపించెను. ఉదారచిత్తులకుఁ గష్టము లేకదా ప్రాప్తి!

మనోరథ మొకరీతి ఫలించెనేకాని పరిపక్వ మయ్యెననుట నిర్నివాదము గాదు. అయిననేమి? ఈమె ప్రబంధముల రాచకన్నె గాదు గావునఁ గొంచెముతోఁ దృప్తినొందఁగల కోమలహృదయ! ఆకొంచెమునకు మాఱుబేరముగ మరణశాపము వచ్చి పడినను, "ఎట్లును గాంక్షితంబు సిద్ధించె. ఇఁకఁ జావు కలిగిన నేమి? శక్తిగుడి యొద్ద దేహత్యాగం బొనర్చెద" నని యుచటికివచ్చి, యాస్థానంబునఁ దనవలెనే శాపగ్రస్తుఁడైన మణికంధరుఁడును, దేవీకటాక్షమున ముదిమివీడి కుమారీరూపంబున విరాజిల్లు సుముఖాసత్తియు, మణిస్తంభుఁడును గుమిఁగూడ, వారు వారు చెప్పినవృత్తాంతములంబట్టి

తన్నుఁగలసిన యతఁడు కుబేరనందనుండు గామి శోకభరాలస యగుచు, నాపెఁజూచి మణికంధరుండిట్లనియె.

క. ... ... ... తరుణి, యట్లపురూపం
బున నన్ను వాఁడ నేఁజుమ్ము ... ...

(ఆ. ౪. ప. ౧౦)

అఁ పలికి

చం. జలజదళాక్షి ! యేను మునిశాపభయంబున నెందు నేరికిం
దెలివి పడంగనీక మది దీనతఁ ద్రిప్పుచుఁ గాని నీపయిం
గలదు సుమీ తలంపు మన గాఢసఖ్యసనంబు వేళలన్
ఫలమిటు లొందె దానికిని భాగ్యవిశేషవశంబునన్ దుదన్.

(ఆ. ౪. ప. ౧౬)

చం. అనుచుఁ గృతార్థనై తిఁ గుటిలాత్ముకుఁ డెవ్వఁడు నన్ను నట్లు వం
చనమునఁ గూడెనో యను విచారము వాసెను నీదుపొందు నా
కు నభిమతంబె, నీకుఁదగ నన్న తలంపున నీతఁబంపునేఁ
గనమిని ద్రిప్పుదున్ హృదయకాంక్షననున్ గనుఁగొన్న వేళలన్."

(ఆ. ౪. ౧౭.)

అనిచెప్పి, యిక్కడను "నీకుఁదగనన్న తలంపు నలకూబరుని యందుంబలె గలదు." అని తనమాట నమ్మునురో యొకమోటములని వాపోవుదురో యను శంకంజేసి, గరువము నభిమానముఁగల కోమల మానస- యగుటచే శపథంబులు ప్రమాణంబులు ననుచితంబులని భావించి,

"ఆనుద్దుల్ హృదయైకసాక్షికము లేనున్నన్ వృథా యిత్తుతిన్."

అని వచించి, నలకూబరునిపై మనసు పోవుటకుఁ గారణ మొండు చెప్పునదియై,

ఉ. ... ... ...సముంచితతాపకరూపశిఖ చో
ప్పనొకకొంత గల్గఁ గని యిచ్చెఁ గుబేరతనూజుఁ గోరితిన్.

( ఆ. ౪. ప. ౨౦. )

కం. శాపభయంబున నెఱయఁగ
నీపైఁ గోరిక మఱల్చి నిధిపతిసుతు నే
పాపపువేళను జూచితి
నో పయిపాటగేమ మఱిగమఁగొన గుత్తిగాన్

ఆ. ౪. ప ౨౧. )

కం. ఆయక్షతనయుఁడని ని
న్నే యేఁబొందితిఁ దుదన్ వలిన్ మదభాగ్య
శ్రీ యేమని చెప్పఁదగుఁ బడఁ
బోయినఁ బూఁబాన్పునఁ బడుపోలిక యయ్యెన్.

( ఆ. ౪. ప. ౨౨. )

ఉ. శ్రీయుతమైన దివ్యమణి చేతికి నబ్బఁగఁ బాఱవైచి త
చ్ఛాయ యొకింత యున్కిఁగని చాలఁగృశించితి గాజుపూసకై
నా యవివేక మేమనుగొన, మదకమ్మణి యబ్బెనన్న స
త్న్యాయత తత్సమాగమ సుఖాప్తికి నోఁచమి నెంచి కుందెదన్.

( ఆ. ౪. ప. ౨౩. )

ఆ. ఇట్టిమాట లిప్పు డే నాడుకొనుట యు
ననుచితంబు, నాగవనిత పలుకు
లిచ్ఛకంబులనక యెవ్వరు నమ్మెద
రదియుఁగాక దృష్ట మన్యవాంఛ.

( ఆ. ౪. ప. ౨౪. )

అని లజ్జాశోకంబులడర నవనతముఖియై యున్నకలభాషిణికి సమాధానముఁజెప్పి నిదర్శనముగా సుగాత్రీశాలీనుల చరిత్రంబు

వక్కాణించి మణికంధరుం డాపెకుం జూపు బోఁగొట్టెను. ఈ నిదర్శన ముద్దానికనఁగా, నొకరిపైఁ బ్రేమయుండినను వారే దేనొక క్రొత్తరీతి నుండినంగాని మఱి సమ్మతింపరను శృంగారన్యాయము నకు ! ఇది శృంగార విశేషములకుం జేరిన భావప్రకృతి. భావ్యకారులైనఁగాని, సర్వకాలముల, సర్వావస్థల నేకరీతి యనురక్తులై వర్తిల్లినవారుండరు. ఏదే నొకవిలాసము వహించి యొక్కొకనిచేఁ దమి తలంతలకేఁగును. మనుష్యులును బహుమూర్తులు గలవారు. అందు హృదయవికాసముం గలిగించునవి కొన్ని మాత్రము. మఱియు నొకరి కొకమూర్తిపైఁ బ్రీతి, ఇంకొకరి కింకొక మూర్తిపైఁ బ్రీతి. రేఖలు, లీలలు, విలాసములు, తత్తద్హృదయసారముల ప్రకారము సుఖదుఃఖావహములగుట వింతగాదు.

అయిన నొక్కటి. పైఁజెప్పిన న్యాయ మేకపురుషునందును వివిధకాలముల స్త్రీకి రాగము మారుచుండుటకు హేతుభూతము. ఒకనియందలి ప్రీతి, వానిమూర్తి ననుసరించి హెచ్చుట, తగ్గుట, తెలిసెను ; కాని కలభాషిణి వృత్తము వేఱు. ఏకకాలమునందే యిరువురి యెడఁ జిత్తము వాలినట్లున్నది. ఇది భావ్యమా ? మనసు, ఒకేకాలమున నిద్దఱిపై సమముగఁ బాఱునా ? అనేకులపై మోహముండుట నిజమా ? ఇది కష్టతరమైన ప్రశ్న. మణికంధరుని వలచినది. నలకూబరుని వలచినది. ఈరీతి యిరువురమీఁద దుర్భర మోహముం బూని యుండిన యొకస్త్రీని చరిత్రముం జదువుటచే నెఱుంగుదును. ఆమె యెవ్వరన, సుమారు నూఱు సంవత్సరములక్రింద ఫ్రాన్సు దేశములో గణ్యయు విద్యాగంభీరయుంగా నుండి వెలసిన 'లెస్పినాస్' అనునామె. కాఁబట్టి యిట్టి వర్తన మస్వాభావికమనరాదు. అపురూపమనవచ్చును. అపురూపశృంగారముల సూచించిన సూరన్నయే "రవిగాననిచోఁ గాంచెదఁ గవి."

కలభాషిణియును నీచనాంతర వృత్తాంత మింతయు నారవాస్వాదము. తనశాపంబు దలంచికొని త్వరలో జీవంబు విడుచుటయు కర్తవ్యమని యెంచి సిద్ధునిం జూచి "యింక జాగేల? నీఖడ్గ మకుంఠితోద్యోగము నంభాశాపమును నారికీవహోయుకాని. కాన త్వరలోం గార్యంబు ముగించి తత్ఫలంబుగ సామ్రాజ్యసుఖంబు ననుభవింపుమా యని ధృతిమైఁ బలికిన, సిద్ధుండు ప్రత్యుత్తర మిచ్చుచున్నాఁడు. "నా భార్య నిన్ను బ్రేమం గూడదని కాళికాదేవిపై నానపెట్టి యుండుటచే మునుపే ఈయుంకోయు యున్నిష్ఫల్యం బడితిని. ఇంక నామాట వినుము. ఈకత్తిని మణికంధరున కిచ్చెదను. అతండు వానిని నీపైఁ బ్రయోగించి రాజ్యలక్ష్మి కాహానీయుండగుంగాక!" అట్లని మణికంధరుని నతిప్రయాసమైన యా క్రూరకర్మమునకు ననుమతుం జేసినఁ గలభాషిణియుఁ గోరి కోరి కామించిన వరుఁడు విధిప్రేరణంబునఁ దనకు యముఁడుగాఁగాఁ గాల వైపరీత్యంబునకుఁ జోద్యంబును నప్రమేయ శాంతియుం జెంది ధీరభావమై "... ... ... మణిస్తంభునకుఁ బదంగనకుం బ్రణామంబు సేసి కన్నీళ్ళు గ్రుక్కికొనుచు 'ఏకలంకపాటు తక్కిన భయమునకుఁ గారము సుండు. ఇమ్ము నెప్పుడు సుఖభావంబున నారాధింపుచుండలేమికింగాని' యనుట యుసు సుముఖాసక్తియు 'నోయమ్మ మన నెమ్మనంబుల కూర్మియుంకిటం బోయెనే. యింతటనైన నీపతియు నీవుఁ గోరినట్లు మమ్ము గుణభావంబున నమ్ముకొనినమోహ' రనినఁ గలభాషిణి పునఃపునఃప్రణామంబు లాచరించి ముకుళితకరకమల యగుచు నిట్లనియె.

[ఆ. ౪. వ. ౧౭౪]

శా. పూతంబైన మదీయ పుణ్యయుగమా పుణ్యాంపు టిల్లాల నీ
పాతివ్రత్యము చందమున్ విన మదిన్ భావింపగా నెట్టి దు

క్షితి ప్రక్రియవారి కైనఁ గృపతో నీవిచ్చినం గల్గుఁ దత్
పాతివ్రత్యము నాకు మీఁదనయినం బ్రాపింప దీపింపవే!

(ఆ. ౪. ప. ౧౪౮)

క. నావుడుఁ బరమపతివ్రత
నై వెలయుము రాజ్యవైభవానుభవం బెం
తేవర్తిల్లఁగ నలరుచుఁ
బ్రోవుఁడు మనుఁబోట్ల నీవిభుండును నీవున్.

(ఆ. ౪. ప. ౧౪౯)

ఉ. అట్టిటు సంచలింపకు దృఢాత్మత నుండుమటంచు నిప్పుడే
మిట్టివి నీకుఁ దెల్పినవి యెయ్యవి, పెండ్లికిఁ బోవునట్లు గ
న్పట్టుచు నున్నదాన వతిభవ్యవికాసము నబ్బుఁజూడ నిన్
గట్టిగ నెన్న దేవతవుగాని నరాంగనవే మృగేక్షణా!

(ఆ. ౪. ప. ౧౫౦)

చ. అని తనుఁబల్కు సజ్జలరుహాక్షిని వీడ్కొని సిద్ధువక్త్రమున్
గనుఁగొని నన్ను నంపితిరె ఖడ్గము నిచ్చెద రే యటంచునా
తనిబలుకత్తిఁ బుచ్చుకొని తా మణికంధరు చేతికిచ్చి యో
గ్య నియమ గంధమాల్యవతియై కలభాషిణి నిర్విశంకతోన్.

(ఆ. ౪. ప. ౧౫౧)

శక్తికి నభిముఖయై కూర్చుండెను. స్వహస్తముతోఁ గత్తి నిచ్చుటేల? ప్రియునకు మనస్సంకోచము వాయుట కొఱకు. సత్యమైన వలపునకుఁ లక్షణ మిదియు. తమ కెన్నివచ్చిన నేమి? ప్రియులు సుఖించుచున్నఁ జాలు. ఖడ్గప్రదానానంతర మతని మనసు గట్టిపడు నట్లుగా

క. సమరంబున నెదిరించిన
వసుదాహిత వీరవరులఁ జక్కడఁచుట, నై

జముమిూఁక సెట్టియెడలన్
బ్రమ యొక చేమఁటవకునికి పటుశౌర్యమునన్.
(అ. ౪. ప. ౧౫౪)

అని తెలిపి కలభాషిణీదేవి యతనిచేత నిరస్త జీవయాయె!

ఈపాత్రము గూర్చి యింత విపులముగ వ్రాసినందుకు క్షమాపణార్థమై కారణములఁ జూపవలయు. సూరనార్యుని వాఙ్మయసృష్టినెల్ల నిర్భ్యాంత సన్నుతయముగ నగ్రగణ్యము. దీనికిం దీటగు చరిత్ర మింకెయ్యదియు లేదు. శృంగారవర్ణనముం జేయుటలోఁ బ్రబంధముల నెట్టు లేవియు వేయలేదు. నలకూబరునికై నాలుగేండ్లకంటె నెక్కువగఁ గాచియుండెఁగదా! ఇష్టుఁడుండినఁ, జెలికత్తెలతో మొఱలిడుట, ఉద్యానవనములో బడి పొరలుట, చంద్రాది దూషణము—ఇట్టి వికారచేష్టలన్నియుఁ జేసినట్లు చెప్పియుండవచ్చును. కాని, కవి యీవిషయములఁ దలఁపనైన లేదని తోఁచుచున్నది. భావనాశక్తిమై వ్రాయువారలకు మనసు పాత్రములయందు లీనముగనుండుఁ గావున సహజభాగములు దప్ప నితరములు దట్టవు. మఱియు నీశాస్త్రీయ ఘోషలకు మధురలాలసా చరిత్రములోఁ బ్రవేశమున్నది గాన నిట ననవసరములని కవి వానిని విడిచిపెట్టెనేమో! కారణము లేదేట నైనఁ బోనిండు, మనకు లభించినదన్ననో మనసు వశముగాక పోవునంత రమణీయమైనకథ. కవికిఁ గృతజ్ఞతమై నమస్కారము, రసికులకు స్వాగతమును.

ఇంత మంచి సుందరమగు పాత్రవర్ణనము శోకాంతముగాఁ జెప్పుట కిష్టము లేమిచేతనో, మఱి, మనకవులకుఁ బట్టిన దౌర్భాగ్యమతంబు కతంబుననో మణికంధరఖండితమస్తకయగు నాలలనాశిరోమణి కాళికాదేవి కరుణాప్రసాదంబున "పునస్సహిత మస్తకయు నిజపురీవర్తినియునై తన బంధు మిత్రాదుల నలరించుచు" సుమారు

రెండు సంవత్సరములనుండి పిమ్మటఁ గాలప్రాప్తమరణ యాయెనని కరుణ రస ప్రధానముగు నీభాగము యొక్క సొంపు నుఁ గవి వికలంబొనర్చి యుండుట భాషాకుర్దశ గదా ? రసములలో శోకము నొక్కటి. ఇది మాత్రము నిషేధ్యమునే ; శోకప్రధానముగాఁ వ్రాసినఁ గవిత్వము యొక్కపోవునా ? మొత్తము మీఁద భారత మీ శోకాంతయుఁట ! దానికి రాని తక్కువ పెఱ వానికి వచ్చునా ?

ఇట్టి యుక్తగ్రంథమునఁ గల్పనాభంగములుండుట చింతనీయము! కృష్ణుని భార్యలయొద్ద కలభాషిణీనారదులు గానవిద్య నేర్చికొనుటకై కడపిన కాలము నాలుగేండ్లు. మణికంధరుఁ డంతఃపురములోనికి బోఁగూడదని యేమో వానికి నయ్యాన మావంతయు లేకయు "పుండరీకాక్షుని యనుగ్రహ విశేషంబున సకలరహస్య సంగీత విద్యా సంపన్నతచేత నారదకలభాషిణుల కన్న నత్యధికుండగు" భాగ్యము లభించినది. ఈ యనుగ్రహ విశేషము ప్రయోగించి, వారికిని సద్యః కాలవిద్యామహాసిద్ధి ఘటించి కలభాషిణీవిరహకాలమును నష్టము చేసి యుండరాదా ? కృష్ణకాంతల శిక్షయ నానావశ్యకమాయె. దానితోఁ గల్పనయు న్యూనమాయె.

ఇట్లే సాధుసీలాలసాచరిత్రము మొదలు తక్కిన భాగములలోఁ గల్పనాలోపములు పెక్కులు గలవు. ఇందుఁ గవి శృంగారమునకు దిగి పాటుప్రబంధధోరణికిం జెందిన యుక్తికిసంతయు సుగంధమని దట్టముగఁ బట్టించుచున్నాఁడు. గతానుగతికముగా వ్రాయుచున్నాఁడే కాని స్వబుద్ధిపొంతఁ బోవునట్లు కానము- భావములు రమ్యములుగావు ; రుచిరములుగావు. పాట ప్రాఁత; మాట రోఁత. మధురలాలస చిన్ననాఁటినుండి కళాపూర్ణునిపై మోహోద్రేకముఁ గొనియుండుట, ఆకస్మికముగా ఇరువురకుఁ బరస్పరదర్శనములభించుట, ఉద్యానవనగమ

లకుఁ జేరినది. పరిమిత ప్రాశస్త్యము. పూర్వభాగ మప్రమేయప్రభావము. దానిని గూర్చి యెంత నుతించిన నత్యుక్తి గలుగదు. అందలి కల్పనలు, సంఘర్షములు మహేంద్రజాలము లట్లాశ్చర్యకరములు. శైలీప్రావీణ్యమన్ననో వాచాతీతము! మౌనముగఁ గ్రోలి హృదయము పరవశముగా నానందింపవలయునే కాని, మాటల దమి తీఱదు. పాత్రముల వచనములు మధురసుధాధారలు!

అట్లగుట శ్రీపింగళి సూరనసూర్యునియెడఁ గృతజ్ఞతయు భక్తియుఁ జూపనెంచినవారును, సహజముగఁ దమకుంగల రసతృష్ణను దృప్తినొందింపఁ దలంచువారును నైన రసికులెల్లరు నీకవికులోత్తంసుని కృతులఁ బలుమాఱు పఠించి కృతార్థు లగుదురుగాక!

---

౧

# శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారి

## కృతులు

### పీఠిక

---

ఈకృతులను రచించినవారు నాముత్తాతగారైన పెద్దరామ లింగారెడ్డి. వీరు పుట్టినసంవత్సరమేదియో తెలియదు. చనిపోయిన సంవత్సరము మాత్రమువీరికృతులు లిఖింపబడియుండు తాటాకుపుస్తకములో నింగ్లీషున వ్రాయఁబడియున్నది. "Ramalinga Reddy died in 1850." బహుశః మాతండ్రిగారైన కట్టమంచి సుబ్రహ్మణ్య రెడ్డిగారీయంశమును వ్రాసియుందురు. చనిపోవుకాలమున వీరివయస్సెంతైయుండునదియు నికరముగాఁ దెలియదు. వదంతిమాత్రమరువది యేండ్లని. దినదినమును పురాణములు కల్పనకువచ్చుచుండు మన హిందూదేశములో వదంతులెంతదట్టముగానున్నను ప్రమాణములు కానేరవు.

మాముత్తాతగారియూరు చిత్తూరునకు సుమారు ముక్కాలు మైలు సమీపములోనుండు కట్టమంచి. చిత్తూరునకుఁ గట్టమంచికి మధ్య నొక చిన్నచెఱువున్నది. బోగముదాని చెఱువని దానిపేరు. దానినుండి సాగింపఁబడు పాఱుదలవల్లనే మాకుజీవనము. మాప్రాంతములలో బోగమువారివల్లఁ గట్టింపఁబడిన చెఱువులనేకములుగలవు. ఆకాలమున విద్యావాసనగలిగిన యల్పసంఖ్యాకులలో వీరును నొక్కరుగానుండుటయు దేవదాసీత్వమునఁజేసి కొంతకుఁగొంత కైంకర్యబుద్ధి గలవారగుటయును వీరి యీధర్మకార్యములకు హేతువులు కాఁబోలు.

ఈకృతులలో ననేక దేవతలు స్తుతియింపఁబడియున్నారు. వారిలో ననేకులు మాగ్రామములోని దేవతలు. కట్టమంచిగ్రామ మాకారమునఁ జిన్నది. నిర్మాణమునఁ జక్కనిది. పశ్చిమమునఁ జెఱువు; ఉత్తరమున నేఁటికి మూన్నాళ్లముచ్చటగాఁ బాఱు నదియొకటి ; టెంకాయ తోఁటలు ; మామిడితోఁటలు ; వర్షాకాలమునఁ బచ్చనిమళ్లు ; విశాలములైనవీథులు—ఈమొదలగు సౌభాగ్యములచే సొంపైనయూరు. దేవాలయములన్ననో పెద్దపట్టణమైన చిత్తూరులో సుప్రసిద్ధమైనది యొక్కటియే యుండఁగా, మాయూరిలోని వాసిసంఖ్య యాఱు. అందు శివాలయము చాలపెద్దది; చోళప్రతిష్ఠ; గంభీరమైన గాలి గోపురముగలది. 1895 వ సంవత్సరమున మాతండ్రిగారు దీనిని మరామత్తు చేయించిరి. ఈశివునిపేరుతత్త్వాలంబీశ్వరుఁడు. బాల్యేశ్వరుఁడనియు నందురు. అంబపేరు కామాక్షి. విష్ణ్వాలయము రెండవది. అనఁగా విస్తీర్ణమున. ఈవిష్ణువుపేరు వరదరాజస్వామి. మాపాడి విఘ్నేశ్వరుఁడు చిత్తూరునకుఁ బోవురోడ్డుప్రక్కన నెలకొల్పఁబడియున్నాఁడు. మేముపరీక్షలకుఁ జిత్తూరునకుఁ బోవునప్పుడెల్ల జయసిద్ధికై మ్రొక్కుకొనుట యీదేవునికే. ప్యాసైనయెడలఁ టెంకాయలు గొట్టి, కర్పూరము వెలిగించుటయుఁ దప్పినయెడల స్వామిని దిరస్కరించుటయు మాపద్ధతులు. నాకు చాలమంచిస్వామి, నేనెప్పుడు పరీక్షలలో నోటమిచెందనందున. మఱియు నదేరోడ్డుప్రక్కనే యాంజనేయస్వామిగుడి యొకటున్నది. ఇవిగాక దుర్గమ్మగుడి యొకటియు, మాయింటివారు ప్రతిష్ఠించిన విఘ్నేశ్వరాలయము, శ్రీరామభజన మందిరము, ఇవన్నియు నున్నవి. కట్టమంచికి 12 మైళ్లదూరములో అరగొండ యనుగ్రామమున్నది. ఈరెంటికిమధ్య కాణిపాకు, బ్రహ్మపల్లె యను నూరులున్నవి. తూర్పున నైదుమైళ్లదూరమున వేల్కూరు అనుపల్లె కలదు. వేల్కూరనిన నాయూరివారికిఁ గోపము. సహస్ర

పురమఁట. దీనినుచ్చరించుశక్తి మాత్రము వారికి లేదు. ఈస్థలములలో మాబంధువులు ప్రబలియున్నారు. మాముత్తాతగారే గ్రామములనన్నింటిని బంధుదర్శనార్థమో, మఱి యేకారణముననో సంచరించియుందురు. ఈయన్ని గ్రామములలోని యధిష్ఠానదేవతలను స్తుతించియుంటట పాఠకులకు స్పష్టము.

నాగురువులైన కుప్పనయ్యంగార్లకు వీరు భాషాగురువులుగా నుండిరని యాకుప్పనయ్యంగారే నాతోఁ బలుమార్లు చెప్పఁగా విని యున్నాను. కుప్పనయ్యంగారిచే మాతాతగారి తాటాకుల ప్రతిలో వ్రాయఁబడిన యీక్రిందిపద్యము దీనికిఁ దార్కాణమనవచ్చును.

"భారద్వాజసగోత్రజుఁడాయరంగార్యపుత్రుఁడతులితతేజ!
స్ఫారగుఁడు కుప్పనార్యుఁడు వారకె యష్టకములెల్ల వ్రాసెధరిత్రిన్"॥

గురుత్వ మెట్టిదో కాని మాతాతగారు వ్రాసిన కృతులు మాత్రము సలక్షణములని చెప్పనెవ్వరికిని గాదు.

ఈ కుప్పనయ్యంగారి సహోదరి నానమ్మ యనునామెను నేను బాగుగ నెఱుఁగుదును. ఈమె 1896 వ సంవత్సరప్రాంతమున 70 యేండ్లకుఁ బైగా బ్రదికి చనిపోయెను. ఈమె రామలింగారెడ్డిగారి జీవితచరిత్ర ననేకపర్యాయములు చెప్పఁగా బురాణ శ్రవణము చేసిన వాఁడను. ఈమె రామలింగారెడ్డిని బాగుగా నెఱిఁగినదఁట. తన యన్నయొక్క గురువు గావున నిందేమియు వింతలేదు.

రామలింగారెడ్డి పొడుగైన మానిసి. ఆజానుబాహువు. నిమ్మపండువంటి దేహచ్ఛాయవాఁడు. ఒకానొకప్పుడు మాయూరి మీఁదుగా బెంగుళూరునకుఁ బోవుచుండు పటాలమువారు, వారిని బలాత్కారముగా సైన్యములోఁ జేర్చుకొని పోయిరఁట. అప్పుడు నానమ్మపోయి సేనానాయకునితోఁ దనకితఁడొక్కఁడే సోదరుఁడనియు

జీవనాధారమునకు నింకెవ్వరు లేరనియు మొఱపెట్టి విడిపించుకొని వచ్చెనఁట. ప్రాచ్యము పటాలములు మాయూరి సమీపముగాఁ బోవుచుండెడివిగాన ఈవిషయము ప్రాయోభావమునకు విరుద్ధము కాదు. ఇంక నానమ్మ తేలిపోయి యుండవలయునన్న, నీకార్యము శ్రీరాముబారముచేతనే కావలసినది. మా రెడ్డినానలు విద్యావతులు గారు. నానమ్మ, తెనుఁగు చక్కఁగాఁ జదివిన యాడుది. కాఁబట్టి యూరివారామెను బతిమాలుకొని తోడ్కొని పోయియుందురు. నానమ్మగారు మాయింటివారికెల్లరకుఁ జాల కావలసిన మానిసి. నాచిన్నతనములో నాపె సులోచనములు ధరించి, వెంకటేశ్వర మాహాత్మ్యము చదువుచుండఁగా వినుచుండెడివాఁడను. ఆపెయుఁ బొడవైనమానిసి; ఎఱ్ఱని దేహవర్ణము గలది. వయస్సున బహు సౌందర్యవతిగానుండి యుండును. గుణమున మిక్కిలియు గొప్పది. నేనామెను "అవ్వ" యని పిలుచుచుంటిని.

రామలింగారెడ్డి వివాహమువిషయమై యాపె చెప్పిన వృత్తాంతమిది. ఆయన చాలయేండ్లవఱకుఁ బెండ్లివద్దని నిరాకరించుచుండెనఁట. తండ్రియైన కోదండరెడ్డి, కారణము చెప్పుమని తొందర పెట్టఁగాఁ దనకు విరక్తి ముదిరినదనియు సాంసారిక చింతల నేమాత్రము పెట్టుకొనఁజాలననియు, సంసారభారమంతయు ససహాయ శూరురాలుగ నిర్వహించెడు కన్యయెవ్వరైన నుండిన నాపెను బెండ్లాడుదుననియుఁ దన మనస్సూత్రమును వెల్లడించెనఁట. పిమ్మట నీనియమముల కంగీకరించిన చెంగమ్మ యను ముద్దరాలు లభించఁగా వివాహమున కొడంబడి చేసికొనెనఁట ఈ కథయందునఁ గొంత సత్యముండ వచ్చును.

మా ముత్తాత యూర్లు విశేషముగఁ దిరిగెడువాఁడని యీ కృతులచే గ్రహింప వచ్చును. మఱియుఁ బూర్వము కవులు

తెలుచుగా ఋషులట్లు పరిగణింపఁబడుచు వచ్చిరి. కాఁబట్టి కొంత వఱకు వీరు సంసారవిషయముల నశ్రద్ధచేసి యుండిరేమోయని యనుమానింపవచ్చును. మాయత్తవ్వ చాలమంచిదని ప్రసిద్ధి. ఈదంపతులకార్వురు కొడుకులుపుట్టిరి. వారిలో రెండవవాఁడైన వీరరాఘవరెడ్డియొక్క మనుమఁడను నేను.

రామలింగారెడ్డి పాకనాటిశాఖకుం జేరినవాఁడు. తండ్రిపేరు కోళంగిరెడ్డి. తల్లి చిన్నమ్మ. గురువు మాయూరికి 12 మైళ్ళ దూరమునందుండు అరగొండ గ్రామములోని కృష్ణమాచార్యులు. ఆయన రాములపూజను, చౌడమాంబార్చనను జేయువాఁడు. రామలింగారెడ్డి కాయనవలన వచ్చినవిద్యలు, మంత్రశాస్త్రము, జ్యోతిషము, కవిత్వము, ఇందులోఁ గడపటి రెండువిద్యలను కుప్పన్నయ్యగార్లకుఁ బ్రసాదించిరి. సంగీతమునందును బ్రగల్భులు. ఇది యెక్కడనుండివచ్చిన దిగుమతియో నాకుఁ దెలియదు. వీరి పాటలు పూర్వము మాగ్రామములలోఁ బాడుటకలదు. ప్రకృతము లేదు.

ఒకానొకప్పుడు శిష్యులైన కుప్పన్నయ్యగార్లు, బురదలో దిగఁబడి నడవఁజాలక, గనిమమీఁదఁ బోవుచుండిన రామలింగారెడ్డిగారిని వచ్చి చేయూఁత నిమ్మని సంస్కృతములో నాక్రోశించిరి. ఆమాట సవ్యాకరణముగా లేనందున, దానిని దిద్ది పునశ్చరణముచేసి ననేకాని రానని కోపించుకొనిరఁట. ఈ యితిహాసము కుప్పనయ్యంగారే యొకానొకప్పుడు క్లాసులోఁ జెప్పిరి. ప్రాణాలకైనను వ్యాకరణము హెచ్చేమో యాకాలపు గురువులకు!

ఈయన మహాకవియని మాబంధువులలో గొప్ప ప్రసిద్ధి. నేను పుట్టిన లగ్నమును, మఱికొన్ని చిహ్నములను, భావిపాండిత్యసూచకములని కుప్పనయ్యంగార్లు వారి పేరు నాకుఁ బెట్టిరి.

వారి కృతులను మా తండ్రిగారు ముద్రింపఁగోరి యెత్తి వ్రాయించిరి. భాస్కరశతకమును వ్రాయించుచున్నప్పుడు పుట్టినందువలన మా కడపటి తమ్మునికి భాస్కరనామధేయము కలిగినది. ఈవ్రాయడము కార్యము ముగింపునకు రాకమున్నె సుబ్రహ్మణ్యారెడ్డిగారు కాలధర్మము నొందిరి. నాకొఱకుఁ దాటాకులప్రతిని గాగితములకుఁ బరివర్తించినవారు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు. పిమ్మట భాస్కరుని సాహాయ్యముచే నీప్రచురణకార్యమేదో యొకవిధముగా నెఱవేఱినది.

ఏదో యొకవిధముగ ననుటయేలనఁగా ఇన్ని యచ్చుతప్పులతోఁ బ్రచురించినందుచేఁ గలిగినదోషము నొప్పుకొనుటకు. ఈగ్రంథమును మదనపల్లెలో, నచ్చట డిస్ట్రిక్టుమునిసిబుగానుండు నాతమ్ముఁడు భాస్కరరెడ్డియొక్క విచారణక్రింద నచ్చువేయించితిని. వాఁడు స్వయముగా నీముద్రణకార్యమును జూచుకొనునంత కాలసౌలభ్యములేనివాఁడు, కాన నిట్లాయె. ఇంతకంటె నెక్కువ చెప్పఁజాలను. గ్రంథకర్తగారి విలక్షణములకుఁదోడు ముద్రణదోషములు వచ్చిపడినవి.

ఈగ్రంథముద్రణోద్దేశములు రెండు. పితృభక్తి చెల్లించుట; బంధువులకు నర్పించుట.



౨

# భారతసార రత్నావళి - భాగవతసార ముక్తావళి

కట్టమంచి సుబ్రహ్మణ్యరెడ్డిగారియొక్క సంక్షేపచరిత్రము.

---

ఈ భారతసార రత్నావళి - భాగవతసార ముక్తావళిని సంపుటీకరించిన వారు నా తండ్రియైన కట్టమంచి సుబ్రహ్మణ్యారెడ్డిగారు. వీరు చనిపోయి యిప్పటికి ముప్పదిరెండు సంవత్సరములైనప్పటికిని వీరి పేరింకను మా జిల్లాలోను, ఇతర స్థలములందును పచ్చగానేయున్నది. 1923 వ సంవత్సరములో జరిగిన జనరల్ ఎలక్షనునందు మద్రాసు శాసన సభికత్వమునకు నభ్యులుగా నిలిచి పోటీసల్పినవారిలో నేనును ఒక్కడను. ఆ సందర్భమున గ్రామ గ్రామ సంచారము చేయవలసిన వాడనైతిని. ఎక్కడకు వెళ్ళినను "కట్టమంచి సుబ్బారెడ్డి కొడుకువచ్చినాడు. అతనికి మనము వోట్లియ్యవలసియున్న" దని నాతండ్రిగారి పుత్రుడనను సన్మానమే కాని నాకు వేఱుగ నాపరమైన సన్మానము లేశమును లభించినది కాదు. ఒకానొకప్పుడు కాళహస్తినుండి నా మిత్రుడు కోటిగారి రంగయ్యసెట్టియు నేనును మోటారుబండిలో తిరుపతికి వచ్చుచుండగా, మార్గమధ్యమున మేళతాళవాద్యములతో కృష్ణాపాళ్యం జమీందారుగారు వేచియుండిరి. వారికిని నాకును పరిచయము లేదు. ఉత్తరప్రత్యుత్తరములును లేవు. పిమ్మట విచారింపగా నీసన్మానమునకు హేతువు, పూర్వము మా తండ్రిగారు ఆ జమీందారుగారికి కొనర్చిన మహోపకారమని తెలిసినది. వీరివలె బ్రిటిష్ప్రభుత్వము వెనుక చిత్తూరుజిల్లాలో విమలమైన యశస్సు నార్జించిన వారింకెవ్వరును లేరు.

మా యింటిలో నాంధ్రభాషాభిమానమును, గొంతవఱకు ప్రవీణతయు పారంపర్యముగ వచ్చుచున్నవి. ఈ సందర్భమున

దొలుతఁ జేర్కొనఁదగినవాఁడు భాస్కరశతకాది కృతికర్తయగు పెద్ద రామలింగారెడ్డి. వారికృతు లిప్పుడే ముద్రింపించి ప్రచురించుచున్నాఁడను. అవి కవిత్వధోరణిగాఁ గాని లాక్షణికసంప్రదాయముగాఁగాని పరిశీలించిన యెడల మిక్కిలి ప్రశస్తములుగావు. అయినను కుగ్రామమైన కట్టమంచిలో నూతేండ్లప్పు డిట్టి చిల్లరకవియు గొప్ప కాళిదాసుగాఁ బరిగణింపఁబడెనేమో !

పెద్దరామలింగారెడ్డి, యొక్క కవిమాత్రము కాదు. సంస్కృతము, జ్యోతిషము, మంత్రశాస్త్రము, షట్ప్రయోగములు మొదలయినవానిని అంగొండ కృష్ణమాచార్యులవారియొద్ద నేర్చుకొనినవారు. మా ముత్తాత యయిన యా రామలింగారెడ్డి శిష్యుఁడు కుప్పసయ్యంగారు. వీరు చిత్తూరు హైస్కూలులోఁ దెనుఁగు పండితులుగా నుండి యఖండమైన పేరును సంపాదించిరి. వారి శిష్యమండలికిఁ జెందిన వారిలో నొక్కఁడను నేను. *

మా తాతవీరరాఘవరెడ్డికాలమునకు మా యిల్లు కడుబీదస్థితికి వచ్చినది. ఇది హిందూ సహకుటుంబ న్యాయ భాగాచారప్రభావము. కోళందరెడ్డికిరువురు కొడుకులు. పెద్దరామలింగారెడ్డి, చిన్నరామలింగారెడ్డి. వీరికి నొక్కొక్కరికి నార్గురు పుత్రులు. కోళందరెడ్డియొక్క యాస్తి పండ్రెండు భాగములు కావలసివచ్చెను. ప్రతిజ్ఞాతికి లభించినది కొంచెము నేలయు నెక్కువ యహంభావమును ! చిన్నరామలింగారెడ్డియొక్క వంశము నేటికించుమించుగ నిరవశేషము. పెద్దరామలింగారెడ్డి సంతతిలో నాలుగు శాఖలు నిలిచియున్నవి.

బీదతనము కారణముగ వీరరాఘవరెడ్డి గుమాస్తాపనిలో దిగుటయేకాక నాతండ్రులకు విద్యకూడ నేర్పింపఁ జొచ్చెను. అందులో మేధాశాలియైన సుబ్బారెడ్డి ఇంగ్లీషువిద్య సయితము నేర్చుకొననారం

* కుప్పసయ్యగారి సర్వలక్షణ సార సంగ్రహముయొక్క పీఠికను జూడనగు,

భింపఁగా, నింత సాహసమా వీనికి, నింత గర్వమా, మించిపోవుటకుఁ బ్రయత్నించుచున్నాఁడా? యని పాలివారు ప్రతికూలించి తండ్రికిఁ గొడుకునకు నానావిధములైన కష్టములఁ గలిగించిరఁట. సహాకుటుంబములయొక్క యనివార్యవిలక్షణ యీర్ష్య. తండ్రి యుద్యోగి, కొడుకు చదువరి. ఈ దోషములకుఁ జేయవలసిన పరిహారము లన్నియుఁ బ్రయత్నించి చూచిరిగాని సుబ్బయ్యయొక్క పట్టుదల చలితమైనది కాదు. ఉదయమునఁ జల్దిదిని పుస్తకము లెత్తుకొని, యొక్క మైలు దూరములో నుండు చిత్తూరునకువెళ్ళి వారిని వీరిని నాశ్రయించి, ఇంగ్లీషు, తెనుఁగు నవకాశము కొలఁది నభ్యసించెను. నాతండ్రికినాకు వలెఁ గ్రమమైన శిక్ష లభింపలేదు. పాపము! ఒక్కనాఁడిక్కడ నింకొకనాఁడక్కడఁగా, ముక్కలు ముక్కలుగా గ్రహింపవలసిన విధివారిది. అయినను స్వయంకృషిప్రధానమయిన విద్య కావున నది చక్కఁగా నాటి ప్రతిదినప్రవర్ధమానమై నిత్యవసంతోత్సవముగ నెగడినది. వీరు ఇంగ్లీషులో వ్యాసుచేసినది. "ప్రొఫిషెన్సీ టెస్టు." ఈ టెస్టు నా పుట్టుకకుపూర్వమే యెత్తివేయఁబడినదికాఁబోలు. వారు చదివిన ఇంగ్లీషు వ్యాకరణము మత్తేగారికృతి. నా కాలమునాఁటికది మృగ్యము. నేను 5-వ ఫారములోఁ జదువుచున్నప్పుడు "రామలింగం! ఏవ్యాకరణము పనికిరాదు నీకు. Marray's Grammar చదువు, అది చాల మంచి పుస్తకము." అని కృతయుగబోధ చేసిరి. కాని చెన్నపురినంతయుఁ గాలించి చూచినను ఆ యాదిమవ్యాకరణము దొరకలేదు. చిత్తూరు హైస్కూలు హెడ్‌మాష్టరులకందఱకును మిన్నయనఁదగు తిరువేంగడసామినాయఁడుగారియెడ మా తండ్రికి భక్తి యెక్కువ. భయ మంతకంటె రెండింతలు. ఆ నాయఁడుగారు సర్వంకషప్రతిభులు; ఇంగ్లీషునందు సంపూర్ణపాండిత్యము; గణితశాస్త్రములో నసమానప్రజ్ఞ; తెనుఁగు, సంస్కృతము సంగీతము, వీణ, చిత్రముపెట్లు,

ఏర్పడెనన నట్లే, వారు పెట్టినదే బిరుదము, వారి దెబ్బే దెబ్బ ! "చిత్తూరు పులి (Tiger of Chittoor.)" అను భీకరమైన పేరు వహించిన వారు. కాలేజీ లెక్చరరుపనిని బుచ్చుకొనుచున్నప్పటికిని జిత్తూరును విడనాడనని నిగ్రహించిరి. భూస్వాములు వారియొద్దఁ జదువు నేర్చుకొనుటకు విద్యార్థులకు సాహస ముండవలయును. సాహసమును శ్రద్ధయు నుండినయెడల ఆయువిల్లలలో నాయేండ్ల విద్యాభివృద్ధి సిద్ధము. ఇట్లు ఖండవృష్టిగ విద్యాకృషి సల్పినవారయ్యును నా తండ్రి యాంధ్రాంగ్లేయములయందు గొప్ప పాండిత్యమును బడయఁజాలెను.

"పరమక్లేశమునఁ జేసి పడసినవిద్యల్ స్ఫురియించుఁగాక"

వీరి యింగ్లీషు లాలైబ్రరీ (Law Library) యంత భండాగారమును చిత్తూరు B. A. B. L లు ఎవ్వరు సేకరించలేరు. తెనుఁగున వీరు చేసిన కృతులే వీరి రసికత్వమునకును వివేచనకును సాక్ష్యములు.

తొలుత మాతండ్రిగారు పితాచారమును బట్టి గుమాస్తాపనిలో దిగిరి. కొన్నియేండ్లకు జిల్లాకోర్టులో రికార్డుకీపరైరి. త్వరలో నాపనికి రాజీనామా యిచ్చి కార్వేటినగరసంస్థానములో మేనేజరుగాఁ జేరిరి. అక్కడిరాజుల విపరీతరాజనము తనకు సరిపడనందున దానిని వదలి ఫష్టుగ్రేడు ప్లీడరుసన్నదును సంపాదించుకొని వకీలు వృత్తి నాశ్రయించి దానికిని దనకును నసాధారణమైనకీర్తిఁ దెచ్చిరి.

తాను కోర్టులో గుమాస్తాగానున్నప్పుడు జడ్జీగానుండిన "కాలేబు" గారును, "రాబర్ట్సు" గారును దనయెడఁ జాల నభిమానము వహించి యన్నివిధములఁ బోషకత్వముఁ జూపిరి. చాల క్లిష్టములైన వ్యవహారములలో రహస్యముగఁ బిలిచి తన యభిప్రాయములడిగెడివారు. వారియందలి కృతజ్ఞతను జూపుటకై తాను నూతనముగ సృష్టికిఁ దెచ్చిన రెండు మామిడిరకములకు

"కాశ్రేటుపసంద," "రాజస్థపసంద" అని నామకరణముల నిడిరి. ఈజాతులు మా తోటలలో నున్నవి.

సుబ్రహ్మణ్యారెడ్డిగారి వకీలువృత్తి యనన్యసదృశము. ఆప నొక క్రిమినల్ కేసులో దన కక్షిదారునకు నురిశిక్ష ప్రాప్తమైనది. ఆనాడు మొదలు క్రిమినల్ కేసులనుగైకొనుటను విడిచిపెట్టిరి. నాతో నొక్క నాడీ విషయమైమాటలాడుచు "నాక్లయంటునకు మరణదండనయను మాటవిన్నదే నాకు కమునకే యుక్రితాడు బిగింపఁబడినట్లు స్తబ్ధుఁడనైతిని. నాఁడు మొదలు మనఃక్లేశము లేశమాత్రమైనఁ గలిగింపఁజాలు కేసులను స్పృశింపనని వ్రతముఁదాల్చితి" నని నుడివిరి. ఇది నిజముగా భీష్మవ్రతము. వీరి సత్యసంధతయొక్క ప్రభావమెట్టిదనఁగా దానే ప్రక్కను వకీలుగానుండిన నదియే సత్యమయిన పక్షమని జడ్జీలు భావించువారు. సత్యమెచటికో యచటికే సుబ్బారెడ్డి. కాఁబట్టి వారిపక్షమున కనుకూలించునట్లు తీర్పు. ఈభావధోరణి చిత్తూరు జిల్లాజడ్జీల నావేశించి యున్నందున నొకానొక మహంతుపై గొప్ప క్రిమినల్ చార్జి తేఁబడినప్పుడు, నేను మాతండ్రిగారి యాఫీసుగదిలో నుండగా నా మహంతుగారే వచ్చి నాతండ్రి నాశ్రయించి "మీరు మాపరము వకీలుగా నుండునట్లు పేరునర్పణ చేసినఁజాలును, మీరు కోర్టునకు రాఁబనిలేదు. వాదింపనక్కఱలేదు. నాపక్షపు వకీలను మాటమాత్రముండినఁ జాలును. ఇదిగో మూఁడు వేల రూపాయలఫీజు. చాలదన్న నింకను ఇచ్చుటకు సంసిద్ధుఁడను. కోరినంత యిచ్చెదను" అని చిన్నబాలుఁడనుగా నున్న నాకు నయితము దుఃఖము వచ్చునట్లు దీనతతోఁ బ్రార్థించినను సుబ్రహ్మణ్యారెడ్డి వ్రతభంగమున కోర్వనని యంగీకరింపలేదు. వీరికి ధనాశ మొదలగు నేమరాశలుఁ బట్టినవికావు.

అయినను మాతండ్రియొక్క కక్షిదారులలో నొకఁడును స్నేహితులలో ముఖ్యుఁడను నయిన నెమ్మిలి వీరాస్వామి రెడ్డిగారు

తొందరపెట్టుటచే, నొకానొక పెద్దమనుష్యుని, అన్యాయముగా నారోపింపఁబడిన క్రిమినలు దావానుండి రక్షించుట కొఱకునై మానాయన సబ్ మేజస్ట్రేటు కోర్టున కొక్క పర్యాయము పోయిరనియు వీరిని జూచుటతోనే మేజస్ట్రేటాశ్చర్యపడి యరగంటలో విడుదల తీర్పు చెప్పెననియు, ఆవీరాస్వామిరెడ్డిగారి మనుమఁడు కుప్పుస్వామిరెడ్డి తన తాత తనతోఁజెప్పినట్లనేక వివరములతో నాకో రెండేండ్ల క్రిందటఁ జెప్పెను. వ్రతధారణానంతరము జరిగినదియీయొక్క భంగమేనఁట. ఫీజుపుచ్చుకొనక స్నేహితకైంకర్యముగా నీకార్యమునకు నిర్బంధముమై పూనిరఁట.

సివిలు కేసుల విషయములో మాతండ్రిగారి సమయసూత్రములు రెండు. ఒకటి చిల్లర కేసులు గ్రహించుటలేదు, మునిసీబు కోర్టులలో నడుగుపెట్టుటలేదు. రెండవది, గొప్ప కేసులైనను క్లిష్టములుగా సందిగ్ధములుగా నుండఁగూడదు. విస్పష్టమైన సత్యములుగా నుండవలయును. కాఁబట్టి మాతండ్రిగారు స్వీకరించెడి కేసులసంఖ్య యెప్పుడును స్వల్పమే. ఆర్జనలో నందఱికంటె నెక్కువ, నెలకు రెండు వారముల కంటె నెక్కుడుగా కోర్టునకుఁబోరు. ఇట్లు మిగిలిన కాలమంతయు గ్రంథపఠనమునందును, మామిడితోఁటల కృషియందును వినియోగించిరి.

తనసమయములకు విరుద్ధములైన కేసులు వచ్చినయెడలఁ, జిత్తూరులోనుండు గోపాలాచార్యులు, అరుణాచలమొదలి, శ్రీనివాసాచార్యులు మొదలగు వకీళ్ళదగ్గఱకుఁ బొమ్మని కక్షిదారులఁ బంపివేయుచుండిరి.

తనవలెనే వకీలువృత్తిలోఁ బ్రథమగణ్యుఁడుగా నుండినవాఁడు నరసింగరావు. కక్షికొక్కరైనఁ బ్రతికక్షికొకరుగా నిలిచి వీరిర్వురు వాదముచేయుచుందురు. తనపార్టీలనందఱను గట్టుమంచికిఁబోయి రాజీ

చేసికొనుఁడని నరసింగరావు విపరీతభావములతోఁ దలకెక్కునట్లు బోధ చేయుటచేతను, సుబ్రహ్మణ్యారెడ్డిగారి సద్ధర్మప్రవర్తనము లోకప్రసిద్ధిగ నుండుటచేతను, నాతండ్రిగారు పట్టిన కేసులలో నూటికిఁ దొంబదివంతు వారిచేతనే రాజీకాఁబడి యుపసంహృతములౌను.

జిల్లాలో గొప్పగొప్ప యాస్తులవిభాగములకుఁ గోర్టువారును గక్షిదార్లును గలసి నాతండ్రిగారినే పంచాయితీదారు (Arbitrator) గాఁ గోరుకొనుచుండిరి. వీరి మరణపర్యంతము నింత నెవ్వరికి నీగౌర వము లభించినదికాదు. తాను చావుపడకలో నున్నప్పుడుసైతము పాళైగారు, చెంగమనాయఁడుగారి వైదులక్షల యాస్తిని గొడుకు లకు నిర్వివాదముగురీతిని బంచిపెట్టుటయుగాక, వారి సమ్మతిమై మిడిల్ స్కూలు నొకదానిని నగరములో స్థాపించి మాన్యముల నేర్పఱచిరి.

తనకక్షిదార్లపట్లఁ దానుచూపు వర్తనమును అనన్యసదృశము. పైని చూపఁబడిన విశేషములనుబట్టి వీరియొద్దకు వచ్చువారు చాలా మంచివారుగా నుండువారే కాని, యల్పులుగారనుట స్పష్టము. మాయింటిలో భోజనము చేయఁగలవారెల్లరు మాయతిథులుగానే యెన్నినాళ్లైనను సరే, యెన్నిపర్యాయములైనను సరే యుండవల యును. కాళహస్తికార్వేటినగరములరాజులు. లాడ్ కృష్ణదాసుగారు. బ్రాహ్మణులు, మొదలగువారికి సిబ్బందితో ఊరిసత్రములో సన్నిసౌక ర్యములు నడిపి మాతండ్రిగారే యతిథులనువలె సన్మానింతురు. ఇది చాల పెద్దధర్మశాల. ఇప్పుడీసత్రము వాడువారులేక శిథిలమైపోయినది.

రెండవది క్రమమైనఫీజుమాత్రము గ్రహించుట. చిత్తూరులోఁ బూర్వమగ్ర గణ్యులుగా నుండినవారు కోటావారు; వైశ్యులు. ఆయింటివారు మాతండ్రియొక్క ధర్మగుణములఁగూర్చి నాతోఁ బ్రసంగించెడివారు. ఒకానొకప్పుడు నాతండ్రిగారు కష్టపడి వానికి నైదువేల రూపాయలు చెల్లునట్లుచేసిరి. వారు సంతోషపడి యధిక

మగు ఫీజు తీయరాఁగాఁ "క్రమవేతనముకంటె నెక్కువగాఁ గైకొన్నచో నది భిక్షముతో సమానము. నిజమైన వకీలు బిచ్చ గాఁడు కాఁడు. ఆర్జికముకంటె నెక్కువ పుచ్చుకొన"నని నిరాక రించిరి.

మూఁడవది బలాఢ్యులచేత హింసింపఁబడు బీదలకు నుచిత ముగా సహాయముచేయుట. ఈ తరగతికిఁ జేరినవాఁడే పూర్వము పేర్కొనఁబడిన కృష్ణపాళ్యం జమీందారు. పాలివా రన్యాయముచేసి యీ జమీందారుని నిల్లు వెడలఁగొట్టగా నా తండ్రియే, యయిదేం డ్లన్నిఖర్చులు భరించి కేసు జయించి, వారిభాగము వారి కిప్పించుటయ గాక, ఫీజు పుచ్చుకొనలేదు. 1923 వ సంవత్సరపు టెలక్షనులో నన్నుఁ జూచునప్పటికా జమీందారు చాల వయస్సుచెల్లిన ముసలాయన. అట్లుండియు నూరేగింపుగా నన్నును కోటిగారి రంగయ్యశెట్టిని నింటికిఁ బిలుచుకొనిపోయి తానే స్వహస్తముతో వడ్డించి, "మీ తండ్రిపెట్టిన భిక్షు నాయనా! నీకుండెడుసాంత మీయింటిలో నాకు లే"దని చెప్పి "నీ కెవరైన వోట్లిచ్చుకొన్నఁ దల పగులఁగొట్టింతును, భయపడవద్దులే. సుబ్బారెడ్డికొడుకునకులేని వోట్లింకెవ్వరి'కని పరమానందభరితునిజేసి నన్ను సాఁగనంపెను.

ఇంకఁ గక్షిదారులుగ వచ్చినవారెల్ల స్నేహితులుగ నిలిచిరని వేఱుగఁ జెప్పవలయునా? మా తండ్రికి లభించినంత స్నేహితసంపద యెవ్వరికి నుండదు.

లాడ్ కృష్ణదాసు, ఆనరెబిల్ పాలవాయి రంగయ్యనాయుఁడు మున్నగు ఘనులను బేర్కొనఁబూనిన నాత్మప్రశంసగ నుండునేమో? ఆత్మప్రశంస యాత్మహత్యకుఁ దుల్యము. కావున సామాన్యులను గొం దఱను నిదర్శనప్రాయముగఁ బేర్కొనెదను. (1) అరికెలవాడి ముని స్వామిరెడ్డి:—వీరి యభ్యంజనస్థానము పిల్లవాండ్రమయిన మాకు

నాశ్చర్యము గలిగించునది. ప్రేలుపెట్టిన ఖతుక్కుని తునుగఁజేయు సంతటి నేర్చినవారై, జుట్టునెత్తి పెత్తికొని తలయూఁచ బోసికొనుచు నొక్క గంటసేపు తలకు దేహమును బట్టించుకొనుచుండెడివారు. స్నానమైనత్రోవకే కొంచెముగ నుండిరి. (2) నెమ్మలి వీరాసామిరెడ్డి : వీరింకను సజీవులైయున్నారు,* చాలమంచివారు. వీరికి భాస్కరుని, నన్నును జూడవలయునను సపేక్ష హెచ్చు. వీరిమామయ్యైన కుప్పుస్వామి రెడ్డి ద్వారా వీరి యింగిత మెంచుకొని మమ్ము విచారించుచున్నారు. (3) కోటిగారి మునిసామిశెట్టిగారు : వీరి కాపురము తిరుపతి. మొట్ట మొదటఁ గక్షిదారులై వీరు మా గృహప్రవేశము చేయుట నేనెఱుఁగుదును. కొంతకాలమునకు నా తల్లికి ప్రియ మిత్రమండలిలోఁ బ్రథములైరి. మా మామ యొక్కయు, అన్న యొక్కయు, వివాహములు విచారణకర్తలుగ నిర్వహించి నడపిరి. నన్నప్పుడప్పుడు తిరుపతికిఁ బిలుచుకొని పోవుచుండెడివారు. ఇట్టి స్నేహము బంధుత్వమునకంటె నెక్కుడుగ ముదిరియున్నను మా తండ్రియందలి భక్తి లేతగాలేదు. వీరు పేకాటయందుఁ జాల ప్రియులు. మా తండ్రిచే నది యిష్టమవ్వనందున నిరసింపబడుచున్నందున వారికిఁ దెలియకయ మా మాట నాడెడివారు. (4) కత్తూరు, సాకన్న రామయ్యశెట్టి : ఈయన మా తల్లిగారికి మంత్రిపట్టు, పనియున్నను లేకున్నను, ప్రతిదినము మా యింటికివచ్చి గృహవిచారణచేసి కావలసిన సరకులఁ దీసి పంపెడివారు. వీరును కోటిగారి మునిసామిశెట్టియు నింటి పెత్తనగాండ్రు. నా తండ్రిగారు సాంసారిక చింతలు పెట్టుకొనరు కావున, ఇట్టి మిత్రుల సాహాయ్యమునఁ నా తల్లిగారే గృహభారము నిర్వహించుచు వచ్చిరి. (5) స్నేహభావమున వీరందఱకును మిన్నయైనవారు మణియం సుబ్బయ్య యను బ్రాహ్మణులు. అరవవారు కూయూరు చేరి కొన్ని సం

* వీరును, వీరి మామయ్య కుప్పుస్వామిరెడ్డియును ప్రకృతము స్వర్గవాసులు.

వత్సరములు హుజ్జూతులలో నొక్కనికిఁ బ్రతిగ మణిపూసము పనిచేసిరి. పిమ్మట ప్రైవేటు వకీలుగా నుండి మితక్రమముతో ధనము కావలసినంత యార్జించుకొనుచు సుఖజీవనకళాకోవిదులై యుండిరి. వీరును వీరి భార్యయు నా తల్లిదండ్రులకుఁ బ్రాణస్నేహితులు. మా యింటినుండి కూరగాయలు మొదలగు సరకు వారియింటికి నెగుమతి; వారియింటినుండి మంచి వంటలు, మా యింట దిగుమతి. ఆకారమున సుబ్బయ్యగారు నేనుఁగు తలలేని విఘ్నేశ్వరులు. పొట్ట యుల్లాసముతో నుబికి దూఁకులాడెడిది. చాల పెద్దది. భోజనప్రియులు. పాపము! ఇంకే చింతలేనివారు. భక్తి, భుక్తి, యివి రెండే వారి జన్మప్రపంచపు ధ్రువ నక్షత్రములు. ఒకనాఁడు మా తండ్రితో ముచ్చటించుచు " ఆ కలెక్టరు రెండువేలరూపాయలు తీస్తాఁడు. లాభమేమి? సుఖమేమి? నేను తినునంతవాఁడు తినగలడా? చెఱుకుగడను గఱ కఱమని నమలి తినఁగలను, నేను. ఈ వయస్సు! డబ్బుంటే యేమిఫలము? సుఖమునను భవించేశక్తి ఆరోగ్యక్రమముగ నుంటే గదా!" యని తమ జీవితకళాసూత్రమును వెల్లడించిరి. ఆ సుబ్బయ్యవంటి నిష్కల్మషచిత్తుఁడు, విశాలహృదయుఁ డింకొకఁడుండఁడు. తన సంపాదన యెక్కువగాను. అందులో నమ్మవా రెంతపొదుపుగ వాడినను దమకై మిగులునది తక్కువ. ఆ కొంచెమును ధారాళముగా దానముచేసి "శివ, శివ" యని సదా భగవన్నామస్మరణ చేయుచు, దెల్లని జుబ్బా, తెల్లని తల గుడ్డ, యెఱ్ఱని పసుపు, తెల్లధోవతి ధరించి మార్గములోనుండు విఘ్నేశ్వరునకు నమస్కరించి, యేదైన నేఁడు దేవుని దయవలన గోర్టులో దొరకునా యని చిత్తూరునకుఁ బోవుచుండురు. పిల్లల కందఱకును వారిని జూచినఁ బరమానందము.

వీరియొక్కయు, మా తండ్రియొక్కయు, దైనందినచర్యలు ద్వంద్వసమానములు. ఉదయము నైదు గంటలకు లేచి, కాల్యకృత్యముల

ములు భారతములో లేవనియు, నా కాలము నాటను బాగుగా దిని కండపుష్టికి భోజనరాయుడుగా నుండిరే కాని, సుబ్బన్నవ్యాసుల గారనియు, బెద్దకేకను వేయునప్పుడు పూర్వకందరులకు చాపరాని నవ్వుగా నుండెడిది. తక్కినవారు మాతంత్రిజెప్పినదే వేదమం యనుకొన్టు వారు. మణియము సుబ్బయ్యగారు "అది తామహారమనే నెలేదు. కనుపు పట్టెదాపెక పై నెవడైక్కువకన రేదుగా! కాబట్టి యది తామస క్రియలలో జేరదు." అని తమకు గావలసిన వికల్పసూత్రమును మాత్రము సమర్థించెదరు. రామయ్యరెడ్డిగారు మాంసాహార ప్రియులు. వారి వాదమేమనగా "ఒక్క భీముడేకాదు, ధర్మరాజు కూడ మాంసము తినేవాడు. ఆ కాలమున సంకటి తింటూవచ్చిరి. అది తింటేనే గాని నిజంగా హింసాధర్మం చెల్లదు. ఈయొక్క విషయం తప్ప తక్కినదంతా సుబ్రహ్మణ్యారెడ్డి బోధించునట్లే" యని మాంసాహార నిషేధము సరిగాదందురు. రాత్రి తొమ్మిది తొమ్మిదిన్నర గంటలకు సభ ముగియును. వారివారి పడకలకు వారు పోవుదురు.

మామిడిపండ్ల కాలములో సిద్ధర్మవిచారణలతో ననుపానముగ మంచి మామిడిపండ్లను కోసి తినుచు, వాని తారతమ్యాచర్యలను నడుపుదురు. "ఒరే! ముట్టెలోనుండేరుచి చెంపలలో లేదురా! చూడండి! ముట్టెను ఎట్లాతింటానో!" యని మా మణియము సుబ్బయ్యగారు ముట్టెను జవురుకొనునట్లు చప్పరించుచుండగా, ఛటుక్కని కొఱకుటయాంజాది వార్షధ్యానములు చేయుచుంటిమి. మామిడివిత్తులను నాటితిమి. మొలకెత్తి, చెట్లయి, యైదారేండ్లకు గాయలు కాయును. ఈ కాయలు విత్తుయొక్క తల్లిచెట్టు కాయలట్లుండవు. అందులకే విత్తువేయక యంటుగట్టవలసిన విధి. విత్తులనుండి యేవేవో నూతన రకములు గలుగును. ఇందులో నూటికి దొంబదితొమ్మిది నిష్ప్రయోజనములు. పరిపూర్ణమైన మామిడిపండుయొక్క సాముద్రికలక్షణము

లక్ష్య:—మంచిరంగు, పలుచని సన్నని తోలు, నారలేకుండుట, చిన్న ముట్టె, ఘనముగు బిగువుగు నైన కండ, మంచివాసన, మంచిరుచి, ఆలస్యముగాఁ గాయు పక్వమునకువచ్చుట; అప్పుడే దానికి మంచి వెల. నాకంత్రీకి డార్విన్‌గారిచేఁ బ్రసిద్ధపఱుపఁబడిన "సహజవికృతి" న్యాయము (spontaneous variation) తెలియదు. వినియు నెఱుఁగను. అయినను సహజమైన వివేకమును బ్రయోగించి యాన్యాయముయొక్క ప్రయోగమును గ్రహించి, విత్తులనుండి మొలచెడు చెట్లలో వేరయిన నూతనఫలము వచ్చును గదా! అదృష్టముండిన మంచిక్రొత్తజాతి యేల యుద్భవింపరాదు? అని వితర్కించి, పరీక్షార్థము విత్తులనుగాటి, యా చెట్లు ఫలించువఱకు వేచియుండి, యా పండ్లను మాయూరిసభలోఁ గోసి తీసి, చర్చించి—ఈ కార్యమునకు ప్రధానమంత్రి రామారెడ్డిగారు, వారుశిష్య సంకెవ్వరు సీనూతన సృష్టులను గోసి నివేదింపఁగా శేఁజూచి యుండలేదు—మంచిదని నిర్ణయింపఁబడినయెడల దానికి నామకరణముచేసి, యా చెట్టునుండి, యంటుకట్టి, యా జాతిని నిలుపుదురు; వ్యాప్తికిఁ దెత్తురు. తక్కిన వానిని నిష్ఫలముచేయుదురు. ఇట్లనేకసంవత్సరములుగా నోపికతోఁ బరీక్షలుసలిపె నాకుఁదెలిసినమట్టునకు నైదు నూతనజాతులను సృష్టింపఁ గలిగిరి:—(1) రాజాపసందు:—కాయగుండ్రము, మల్గోవాకంటె రెండింతలు పెద్దది. మంచిరుచి. కాయపెద్దది. కాడసన్నము. కాని, కాయుట తక్కువ గాలికి నిలుచుటకష్టము. నిలిచినకొన్నియుఁ బ్రశస్తములు. (2) రెడ్డిపసందు:—కాయపెద్దది. చర్మము ఘనముగు, గడుసును. రంగు వికారము, అనాగరకము చూచుటకు—రుచిమంచిది. (3&4) రాబట్టుపసందు, కాలేటుపసందు:—గుండ్రములైన పేలిమిరకములు. (5) భోగంపసందు:—చూచుటకు మంచిరంగుతో నాణె

ముగా నాటితిని. [illegible] వినోదార్థము కొన్ని చెట్లు మాత్రమే వేసితి.

కోస్తాజిల్లాల [illegible] సంతతభాగవతము లకు, మా[illegible] నా తండ్రిగారు, రెండింటను ప్రసిద్ధి జెందిరి.

మణి[illegible] వ్యాధిచే పీడితులై తమ దేశమునకుఁ బోవుట నా తండ్రికి [illegible] దుఃఖకారణమా యెను. వారు బ్రాహ్మణులు; మేము [illegible] ఏ భేదములేక సహ కుటుంబములట్లు టిమి.

చిత్తూరులో నారాయణస్వామిఅయ్యంగార్లు అను వైష్ణవబ్రాహ్మణులు పూర్వము డిప్యూటీకలెక్టరుగా నుండిరి. వారికిని నాతండ్రికిని సంపూర్ణమైన మైత్రి యుండెను. వారు చనిపోవునప్పుడు మా తండ్రిగారిని, తమ భార్య కనకమ్మకుఁ గూతురు కమలమ్మకు, గార్డియనుగా నియమించిరి. ఆ యిర్వురను మా తండ్రిగారు చెన్నపట్టణము పెళ్ళుంబూరి లోనుంచి తమ మరణపర్యంతము వారికేకష్టము రాకుండునట్లు తల్లిదండ్రులకంటె నెక్కువగా రక్షించిరి. వారిద్దరు సంవత్సరమునకు రెండుమార్లు పట్నమునకుఁ బోవుచుండిరి. వారు పోవునప్పుడెల్ల నన్నును బిలుచుకొనిపోవుచుండిరి. ఒక్కొక్కప్పుడు మా యక్కయు వచ్చును. ఒకానొకప్పుడు కమలమ్మయు మా యక్క సుందరమ్మయుఁ దా ముందు గదిలోనికి నన్ను రావలదనఁగా బాల్యవిపరీతకోపినై కొరడాతో వారిద్దఱను గొట్టితిని. వారు మా తండ్రితోఁ జెప్పికొనిరి; కాని వారు నన్నేమియు ననలేదు. నేనెప్పుడు తండ్రితో నుండువాఁడను. వారికిని నాయందు బ్రీతియెక్కువ. "ఘటికుఁడ" నను నభిమానము కూడ. కాబట్టి కనకమ్మగారు నన్ను "మంత్రి" యని కించిద్ధేళన ముతోఁ బిలిచెడివారు. సుబ్రహ్మణ్యారెడ్డి చనిపోయినపిమ్మట వారి వ్యవ

ముగా నుండును. కంచి మంచి కాదు. వినోదార్థము కొన్ని చెట్లు మాత్రమే వేసిరి.

కోర్టువారు [illegible] [illegible] [illegible] [illegible] శాంతభాగవతము లకు, మాయింటిలో [illegible] నా తండ్రిగారు, రెండింటను ప్రసిద్ధి జెందిరి.

మణి [illegible] సుబ్రహ్మణ్యగారు [illegible] వ్యాధిచే పీడితులై తమ దేశమునకుఁ బోవుట నా తండ్రికి [illegible] దుఃఖకారణమాయెను. వారు బ్రాహ్మణులు; మేము శూద్రులము. ఏ భేదములేక సహకుటుంబముట్లు ఉంటిమి.

చిత్తూరులో నారాయణస్వామయ్యంగారు అను వైష్ణవబ్రాహ్మణులు పూర్వము డిస్ట్రిక్టుమున్సిఫ్‌గా నుండిరి. వారికిని మా తండ్రికిని సంపూర్ణమైన మైత్రి యుండెను. వారు చనిపోవునపుడు మా తండ్రిగారిని దమ భార్య కనకమ్మకుఁ గూతురు కమలమ్మకు, గార్డియనుగా నియమించిరి. ఆ యిర్వురను మా తండ్రిగారు చెన్నపట్టణము ఎగ్మూరులోనుంచి తమ మరణపర్యంతము వారికెట్టి కొదవయు లేకుండునట్లు తల్లిదండ్రులకంటె నెక్కువగా రక్షించిరి. వారికై సవత్సరమునకు రెండుమార్లు పట్నమునకుఁ బోవుచుండిరి. వారు పోవునప్పుడెల్ల నన్నును బిలుచుకొనిపోవుచుండిరి. ఒక్కొక్కప్పుడు మా యక్కయు వచ్చును. ఒకానొకప్పుడు కమలమ్మయు మా యక్క సుందరమ్మయుఁ దా ముందు గదిలోనికి నన్ను రావలదనఁగా బాల్యవిపరీతకోపినై కొరడాతో వారిద్దఱను గొట్టితిని. వారు మా తండ్రితోఁ జెప్పికొనిరి; కాని వారు నన్నేమియు ననలేదు. నేనెప్పుడు తండ్రితో నుండువాఁడను. వారికిని నాయందుఁ బ్రీతియెక్కువ "ఘటికుఁడ" నను నభిమానము కూడ. కాఁబట్టి కనకమ్మగారు నన్ను "మంత్రి" యని కించిద్ద్వేషముగాఁ బిలిచెడివారు. సుబ్రహ్మణ్యారెడ్డి చనిపోయినపిమ్మట వారి వ్యవ

హోమములోఁ జాగుచేసికొనక వచ్చెను. నేను 1902వ సంవత్సరములో కేంబ్రిడ్జికిఁ బోవునపుడు నా ఉంపుడు సహోదరియైన కమలమ్మను జూచి నీవుండి వచ్చినట్లోడనే నా సంతాపమున నే నామెకు గృహమేర్పఱచి శక్తికొలఁది జూచుకొందునని సమ్మతించి చెప్పి యోదార్చి పోయితిని. నా దురదృష్ట మాప్రీతి కార్యమును జేయనిచ్చినది కాదు. నేను వచ్చుటకొక్కయేడు ముందుగనే కమలమ్మగారు మరణించిరి. ఆమెకుఁ బూర్వమే తల్లి కనకమ్మయుఁ దరలిపోయెను. ఆ బ్రాహ్మణ కుటుంబమునెడఁ బ్రీతియు గౌరవమును దాల్చి మేమెంతయో చేసితిము గాని, మనసు కోరినంత సుఖము నేకూర్పఁజాలమైతిమి. మా యింటిలోని ప్రతి శుభకార్యమునకు వారు రానిది జరపనెంచము. వారి కష్టసుఖములన్నియు మాయవిగా నెంచి మైత్రి నెఱవేర్చితిమి. చావుతో మాకు వియోగము సంభవించెనుగాని, మాయెడవలనను ఆమైత్రి కొక్క క్షణమాత్రభంగమైన రాలేదు.

కట్టమంచి సుబ్రహ్మణ్యరెడ్డికి దైవభక్తి యెక్కువ. దానితో పాటు ఛాందసములును.

ఫోటోగ్రాపు తీయించుకొనిన నాయుశ్శు క్షయకరమని తన పటమును దీయనిచ్చుటలేదు. వీరివలెనే మాచిన్నాయన రంగారెడ్డియు నాకృతిపటమును దీయుచుకొనకయే చనిపోయెను. ప్రతిబింబము తీయించిన బింబమునకు హానియట! మా నాయనకు గుఱ్ఱముల నుండుటయు నాక్షేపణీయము. ఆయోగము రాజులకేగాని యింకెవ్వరికిఁ దగదు. తన గ్రంథములో రెడ్లను పుడమితేఁడులని సంభావించి యున్నాఁడు. గుఱ్ఱములు కూడదనుట ప్రకటనయే! తానొంటెద్దు బండిలో నెన్నఁడును గూర్చుండఁడు. అది పాపము. మఱి వాహనత్వము చెల్లుననఁగాఁ దెల్లని రెండెడ్లబండి. తన కనుకూలించురీతిని పెద్దవిల్లుబండి కట్టించి దానికిఁ బెద్ద తెల్లని యెడ్లను రెంటిఁ బూన్పించి

ముగా నుండును. రుచి మంచిది కాదు. వినోదార్థము కొన్ని చెట్లు మాత్రమే వేసితి.

కోర్టువారికిం బోక మిగిల్చిన కొంచెము ధనముచేతను భారతభాగవతము లను, మాయింటిలో యుంచుకొని మోక్షించి మా తండ్రిగారు, రెండింటను ప్రసిద్ధి జెందిరి.

మణియము సుబ్రహ్మణ్యగారు వార్ధక్యమును వ్యాధిచే పీడితులై తమ దేశమునకుం బోవుట నా తండ్రికి శాశ్వత దుఃఖకారణముగా యెను. వారు బ్రాహ్మణులు; మేము శూద్రులము. ఏ భేదములేక సహా కుటుంబమట్లుంటిమి.

చిత్తూరులో నారాయణయ్యంగార్లు అను వైష్ణవబ్రాహ్మణులు పూర్వము డిస్ట్రిక్టుమ్యునిసిఫ్‌గా నుండిరి. వారికిని మా తండ్రికిని సంపూర్ణమైన మైత్రి యుండెను. వారు చనిపోవునపుడు మా తండ్రిగారిని, తమ భార్య కనకమ్మకుం గూతురు కమలమ్మకు, గార్డియనుగా నియమించిరి. ఆ యిద్దరను మా తండ్రిగారు చెన్నపట్టణము ఎగుంబూరి లోనుంచి తమ మరణపర్యంతము వారికెట్టి కొదవయు లేకుండునట్లు తల్లిదండ్రులకంటె నెక్కువగా రక్షించిరి. వారికై సంవత్సరమునకు రెండుమార్లు పట్నమునకుం బోవుచుండిరి. వారు పోవునప్పుడెల్ల నన్నును బిలుచుకొనిపోవుచుండిరి. ఒక్కొక్కప్పుడు మా యక్కయు వచ్చును. ఒకానొకప్పుడు కమలమ్మయు మా యక్క సుందరమ్మయుం డా ముందు గదిలోనికి నన్ను రావలదనంగా బాల్యవిపరీతకోపినై కొరడాతో వారిద్దరినిం గొట్టితిని. వారు మా తండ్రితోం జెప్పికొనిరి; కాని వారు నన్నేమియు ననలేదు. నేనెప్పుడు తండ్రితో నుండువాడను. వారికిని నాయందుం బ్రీతియెక్కువ "ఘటికుడ" నను నభిమానము కూడ. కాబట్టి కనకమ్మగారు నన్ను "మంత్రి" యని కించిద్ధేళనముగాం బిలిచెడివారు. సుబ్రహ్మణ్యారెడ్డి చనిపోయినపిమ్మట వారి వ్యవ

యందులో కాకపోకలుచేయుట వారి పద్ధతి. నా కన్నతండ్రి రామ
స్వామిరెడ్డికి గుఱ్ఱములమీఁద వ్యామోహమెక్కువ. నాకుఁ దెలిసి
యొకదానివెనుక నొకటిగా మూఁడుగుఱ్ఱములఁ గొనెను. కొనినప్పు
డెల్ల నన్నగారియొద్ద క్షమాపణార్థము కల్లసమాధానములు చెప్పు
చుండును. మూఁడవగుఱ్ఱమును గొనినప్పుడు వేలూరులో (నాఁడు
వేలూరులో వకీలుగానుండెను) ఒక జనీయను తన కీనాముగా బలవంత
పెట్టి యిచ్చినాఁడని సమ్మోహనాస్త్రము వేసినాఁడు గాని, దాని
వలనఁ బెద్దాయనకుఁ గోపము రెండింతలై నాయెదుటనే మాచిన్న
నాయనను (అప్పటికి 38 యేండ్ల వానిని) జెడఁదిట్టెను. ఈమంగళా
శాసనములైనవెనుక మాచిన్నాయనయును, నేనును మేడమీఁదికిఁ
బోవుచుండగా నేనూరకయుండక చనువుచేతఁ గలిగిన చాపల్యముపై
"చిన్నాయనా! చిన్నాయనా! నిన్ను మానాయన బాగాతిట్టినాఁడే"
యని యంటిని. మా చిన్నాయన నవ్వుచు "అవి తిట్లుకావురా,
తమాషామాటలు" అని త్రోసిపుచ్చెను. ఆ కాలపు టన్నదమ్ముల
సౌహార్దము నేఁడుకలదా?

రామస్వామిరెడ్డి రాజసగుణుఁడు. సుబ్రహ్మణ్యరెడ్డికి సత్త్వగుణ
మెట్లు ప్రధానమో తమ్మునికి రజోగుణమట్లు. వారికిని నాయందుఁ
బ్రాణసమానమైన ప్రీతిగావున నప్పుడప్పుడు నాచదువెట్లుపునను విచా
రణ లేకయ వేలూరునకుఁ బిలుచుకొనిపోయి మాసములకొలఁది నుంచు
కొనును. అక్కడ నాకు మిఠాయిపొట్లములేమి, భోగమువాండ్రు
వచ్చి స్నానముచేయించి నయముగా నొప్పిలేసి విధమునఁ దలదువ్వుట
లేమి—చాల బాగుగ నుండునది కాలము! విరించిపురము కోవెలకు
మాచిన్నాయన ముఖ్యధర్మకర్త. అక్కడకు వెళ్లినప్పుడెల్ల బ్రాహ్మణ
ఫలాహారములు, పసిబిడ్డగదాయని దేవదాసీగణముచేయు పరిచర్యలు
మొదలగునవి దట్టముగాఁ బడుచుండెను. మా తండ్రికీవిపరీతములు

